## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020010004901

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

| | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| A | B | C | D | E | F | G | H | I | J | K | L | M | N | O | P | Q | R | S | T | U | V | W | X | Y | Z |

**Author's Last Name**

| | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| A | B | C | D | E | F | G | H | I | J | K | L | M | N | O | P | Q | R | S | T | U | V | W | X | Y | Z |

**Year**

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |

**Subject**

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |

**Language**

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

భాస భారతరూపకము:—

# దూతఘటోత్కచము

(అనువాదము)

రచయిత:

దీపాల పిచ్చయ్యశాస్త్రి

నెల్లూరు



1959

 [వెల. రు. 0-50

# దూత ఘటోత్కచము

---

## కథాసంగ్రహము

కౌరవులు పద్మవ్యూహమున నభిమన్యు నొంటిపాటున దొమ్మిచేసి పడగొట్టి, అంతటితోనె తమకు జయము చెప్పినట్లు చంకలు కొట్టుకొను చుండగా, శ్రీకృష్ణునిపంపున ఘటోత్కచుడు దూతగావచ్చి వారి కొకసందేశ మందిచ్చిపోయినట్లు ఈ రూపకమున కథ.

సందేశము శ్రీకృష్ణునిది. అందు ధృతరాష్ట్రునకును, దుర్యోధనున కును, తక్కిన రాజులకును వేఱువేఱుగా హెచ్చరికలు.

"ఏకపుత్త్రశోకముచేతనే అర్జునుడల్లాడపోతున్నాడు; నీకురానున్న శోకము అంతకు నూరంతలు. కాబట్టి, పుత్త్రశోకతీవ్రాగ్ని కాహుతి కాకుండా నీవు నీ మనస్సు నిప్పుడే భద్రపరచుకో" అని ధృతరాష్ట్రునకు హెచ్చరిక.

అభిమన్యువధవార్త అంతకుముందే విని, అర్జునుని చేతిలో తన తనయులందరూ హతులైనట్లే నిశ్చయించుకొని, పరితపించుచూ, కొడుకులను మందలించుచున్న అంధరాజు, కృష్ణుని సందేశమును విని,—"చక్రాయుధుడు సవ్యసాచిచేత సర్వక్షత్త్రసంహారము చేయింప సంకల్పించియే యీ సందేశము పంపినా"డనును. ఆ మాటకు కురురాజు పరిహసించును. దూత, "దుర్యోధనా! నీవు పరిహసించినవు గాక; మా ప్రభువు నీకుపంపిన సందేశమును విను"మనును. దుశ్శాసనుడు 'మేము వినము పొ'మ్మని తిరస్కరించును. అతనిని వారించి రారాజు "ఇంతకును మీ ప్రభుని సందేశ మేమని?" అని ఘటోత్కచు నడుగును.

అపుడు ఘటోత్కచుడు,—

"అనుకొనుము క్షత్త్రియవినాశ మైనయట్లె
తీఱిపోవునుగాక భూభారమింక;

సుతవనోద్రిక్త పార్థనిష్ఠురనిశాత
బాణకీలల కని సహింపఁగలేడు"

అని మా ప్రభుని సందేశము"– అని బదులు చెప్పును. శకుని "అంతా మాటలతోనే" అని అవహేళనము చేయును. అందు కాగ్రహించి ఘటోత్కచుఁడు యుద్ధమునకు సిద్ధపడును. "వలదు వల"దని ధృతరాష్ట్రుఁడు బతిమాలును. ఘటోత్కచుఁడు శాంతించి, "కురుపతీ! మా ప్రభునకు నీ విజ్ఞాపన మేమి?" అని యడుగును, అతఁడు "వానికి విజ్ఞాపనమా? వాని సందేశమునకు నా బాణములే ప్రతిసందేశమగును. పాండవులను వెంటఁబెట్టుకొని యుద్ధమునకు రమ్మనుము; పొమ్ము" అనును.

అప్పుడు ఘటోత్కచుఁడు తక్కినరాజులను జూచి, "రాజులారా! మీ మీ మనసులందుఁగల కోరికలెల్ల నిప్పుడే తీర్చుకొనుఁడు. ఇఁక నెక్కువ వ్యవధి లేదు. రేపు కరకర ప్రొద్దుపొడుచువేళకు పాండవరూపమృత్యువు మిమ్మందఱ్ని కబళించుట ధ్రువము. ఇది చక్రాయుధుని సందేశమున కడపటివాక్యము" అని చెప్పి తాతగారి సెలవుతీసికొని వెళ్లిపోవును. ఇంతే కథ.

ఈ కథకు భారతములో ఆధారము లేదు. అంతయు భాసుని స్వకపోలకల్పనమే. కథ కల్పితమైనను కల్పనవలె కనుపట్టక స్వభావసుందరమై భారతకథాభాగమే యనిపింపఁదగినట్లు రూపొందినది.

ఇందు ధృతరాష్ట్రుని ముందాలోచనయు, శ్రీకృష్ణునియెడ నతనికిఁగల భయభక్తులును, దుర్యోధనుని దురభిమానమును, దుశ్శాసనుని దురహంకారమును, శకుని కుత్సితస్వభావమును చక్కఁగా ప్రదర్శితములైనవి. ఘటోత్కచునిపాత్రము ప్రశంసాపాత్రముగా పోషింపఁబడినది.

కవి స్వల్పమైన యీ రూపకమునందు పతాకస్థానకాదిచమత్కారసన్నివేశము లమర్చి, భాసుఁడీ రూపకమునకు గుణాధిక్యమును సమకూర్చినాఁడు.

కథాప్రారంభముననే సుస్సల, అభిమన్యు మరణవార్తాశ్రవణమున ఘూర్ణిల్లి, తెలివొందిన - "ఉత్తరగర్భస్థునకు నిమిత్తమైనవాఁడు తన

భార్యకు వైధవ్యమును విధించుకొన్నవాడే'' అనును, వెంటనే, అభిమన్యు వధకు నిమిత్తభూతుఁడు తన పెనిమిటియే యనుట తెలిసి విలపించును.

దుస్సల అనుకొన్నదొకటి; అయిన దింకొకటి. ఇదియొక సంవిధాన చమత్కృతి. ఇట్టి సంఘటనలకే *'పతాకాస్థానకము' అని పేరు.

అనర్థదాయకములగు వివాదములకు దారితీయు సన్నివేశములు కల్పించి, పాత్రలకును - సామాజికులకును తహతహపుట్టించి, అంతలోనే మరల సుళువుగా పరిష్కరించుటలో భానుఁడు సిద్ధహస్తుఁడు.
ఉదాహరణకు. —

(1) ధృతరాష్ట్రుఁడు శకునిపైఁ గోపించి, — "ఓరి జూదరీ! నీవు మా కులమున రగిలించిన కలహాగ్ని మా వంశాంకురములనైనను విడువక దహించుచున్నదిగదరా'' అని నిందించును.

ఆ నింద కాగ్రహించి, శకుని యెంతదుడుకుగానైనను బదులాడుట కును, తొందరలమున గొడవ యెంతవరకును పెరుగుటకును అవకాశమిచ్చు పట్టది. అప్పట్టున భానుఁడు, తెరలో నాక ధర్మసంకటపరిస్థితిని కల్పించి, అందరి మనస్సులను ఆ సంకటమువైపు మరలించి, శకుని ప్రత్యుత్తరమునకు అవకాశము లేకుండఁజేసి, ఆ గొడవ తప్పించినాఁడు.

(2) దుర్యోధనుఁడు, 'అర్జునున కగపడకుండా సైంధవుని దాఁచి, అర్జును ప్రతిజ్ఞను భంగపఱుతు'' ననఁగా, ధృతరాష్ట్రుఁడు.— ఓరి వెఱ్ఱివాఁడా! సైంధవుని దాఁచెదవా! ధర్మానుబంధులకు కృష్ణుఁడు కన్నులు. సైంధవుని నీ వెచటదాఁచినను వెదకిపట్టి అర్జునుఁడు వాని శిరమును త్రుంచి తీరునురా'' అనును.

---

"యత్రార్థే చింతితేఽన్యస్మిన్ తల్లింగోఽన్యః ప్రయుజ్యతే
ఆగంతుకేన భావేన పతాకాస్థానకం తు తత్''

— నాట్యశాస్త్రము.

అప్పుడు దుర్యోధనుని భటుఁడు—"ఈ మాట సహింపరానిది; ఇట్లు, ఇంకొక డెవడైనా అనివుంటే, వానితల యిప్పటికే రెగిరిపోయివుంహేది" అనును.

ఆమాట వెంటనే ఘటోత్కచునిఁ బ్రవేశపెట్టి, ఆ మహాకవి, కథాప్రవాహమును వేరొకప్రక్కకు త్రిప్పినాఁడు. లేకున్నచో, ఆ భటుని దుడుకుతనాఁత కాగ్రహోదగ్రుఁడై పెద్దగా జేనునియుంచునో, అంతపై వ్యవహార మెట్లు పరిణమించియుండునో గదా!

ఇందలిపాత్రముల సంభాషణలును రసదృష్టినరయువారి కాహ్లాదకరములై యున్నవి. ఉదాహరణ కొకటి.—

దుర్యోధనుఁడు,—

"మాతృపక్షోగ్రరూపదర్పాతిశయముఁ
బట్టి కొంబోలు నంతగా బిట్టిపడెదు;
వీసమైనను నీ కేము తీసిపోము
రాక్షసోగ్రస్వభావదర్పములయందు"

అని, తన ప్రలాపమును గొప్పగా చెప్పికొని, ఘటోత్కచుని గేవరించి యదలించును.

అందుకతఁడు,—"నిజమే; రాక్షసులు మీయంతటి క్రూరులుగారు.

*భ్రాతల్ నిద్దురవోవఁ జూచి యిలు కాల్పంబోరు రాత్రించరుల్
భ్రాతృస్త్రీనగు లంటఁబట్టి సభ నీడ్వంబోరు రాత్రించరుల్

---

*"న తు జతుగృహే సుప్తాన్ భ్రాతౄన్ దహంతి నిశాచరాః
శిరసి న తథా భ్రాతుఃపత్నీం స్పృశంతి నిశాచరాః
న చ సుతవధం సంఖ్యే కర్తుం స్మరంతి నిశాచరాః
వికృతవపుషోఽప్యుగ్రాచారా ఘృణా న తు వర్జితా"

ఘోరస్త్రీయుం బసివాని నాఁగి వధియింపంబోరు రాత్రించరుల్
భీతింగొల్పు దురూహులయ్యును కృపక్షావిద్యోత్కు రాత్రించరుల్''

అని సమాధానము చెప్పెను, ఎంత చక్కనిసమాధానము!

సుకుమార హాస్యరసరంజితమైన ఆ గొల్లుంగనప్రత్యుక్తితో రారాజు గారి ప్రతాపప్రకటనప్రసంగము బందైపోయినది.

ఇట్లు పద్యములలోనే గాక గద్యభాగములోను ఆ కవీంద్రుని రచన సునిశితముగను - సురుచిరముగను పరువులువాఱినది.

పాత్రల సంభాషణలు చిన్నచిన్న వాక్యములతో, చుఱుకుగను - సూటిగను భావములను విరజిమ్ముచూ చకచక సాగిపోవుచుండును. ఆ పలుకులలోని భావవేగమునకు గ్రాంథిక భాషకంటెను, వ్యావహారికమే తగినదని నాకు తోఁచినది. అందువలన పాత్రోచితముగా వాడుక భాషయు, సందర్భానుగుణముగా శిష్టవ్యవహారభాషయు నేనీ యనువాదమున వాడియున్నాను. నా యితరానువాదములవలెనే యిదియు స్వేచ్ఛానువాదమే. అవసరమని తోఁచిన తావుల నొకటిరెండు చిన్నచిన్న మార్పులను చేసియున్నాను. పండితులు మన్నింతురుగాక.

# రూపక లక్షణము

ఇందలి వృత్తము కేవలకల్పితము. [illegible] ఈ రూపక మున రసము కరుణము. [illegible] గాని, [illegible] యుద్ధము జయ [illegible]. జయ పరాజయములు వాఙ్మాత్రములే. కథానాయకులలో ఘటోత్కచుడు [illegible] (దివ్యులు లేరు). కుంతీదేవి పరిదేవన మింకొకింత యున్నది. ఈ లక్షణములనుబట్టి యీ రూపకము ఉత్సృష్టికాంకము.

"ఉత్సృష్టికాంకే ప్రఖ్యాతం వృత్తం బుద్ధ్యా ప్రపంచయేత్
రసస్తు కరుణః స్థాయీ నేతారః ప్రాకృతా నరాః
భాణవత్సంధి వృత్త్యంగా న్యుక్తః స్త్రీ పరిదేవితైః
వాచాయుద్ధం విధాతవ్యం తథా జయ పరాజయౌ"

—దశరూపకము.

# కృతజ్ఞత

భాస భారతరూపకముల నాఱింటిని, అనువదింపవలెనన్న నా సాహససంకల్పము భగవదనుగ్రహమున నిప్పటికి నెఱవేఱినది. గ్రంథ రచన కంటెను తత్ప్రకటనమే, యీ కాలమున కవికి కష్టసాధ్యమైన కృత్యము. పరమేశ్వరుని కృపావిశేషమున ఆ కృత్యమును నాకు సుఖ సాధ్యమే యైనది.

క. భాసుని పేరుబలంబో
నా సుకృతమొ గాని, యాచనాదైన్య భరా
యాసము లేకయె దొరకిరి
యీ సత్కృతి షట్కమున కధీశులు రసికుల్.

'కర్ణభార' కృతి ముద్రణమునకు తోడ్పడిన వదాన్యోత్తములు
శ్రీ రేబాల హరిప్రసాదరెడ్డిగారే
యీ 'దూత ఘటోత్కచ' కృతి ముద్రణమునకును ద్రవ్యదాతలు.

వారి యీావి,—

"చాతక స్త్రి చతురాన్ పయఃకణాన్
యాచతే జలధరం పిపాసయా,
సోఽపి పూరయతి విశ్వ మంభసా
హంత హంత మహతా ముదారతా"

అన్న పండితరాయల సుభాషితమునకు చక్కనితార్కాణయైనది. శ్రీ రెడ్డి గారికి నా కృతజ్ఞతాపూర్వకాశీర్వాదములు.

అచ్చుపనిలో నచ్చుకు తావీయక, యెక్కువశ్రద్ధతో నా యీ భారతరూపకముల నాటింటిని ముచ్చటగా తీర్చి నా కానందమునుగూర్చిన శ్రీ 'కోకిల' ప్రెస్ యజమానులకు నా యభినందనములు.

ముద్రణకార్యమున నాకు తోడునీడగానుండి, శ్రమకోర్చి, సహాయము చేసినవారు, నా ప్రియమిత్రులు విద్వాన్, శ్రీ నవులూరి మాలె కొండయ్య పంతులుగారు. వారికి నా ప్రేమపురస్సరాశీశ్శతములు.

నెల్లూరు,
1-1-1959

దీపాల పిచ్చయ్యశాస్త్రి

# పాత్రములు

## పురుషులు

ధృతరాష్ట్రుఁడు

జయత్రాతుఁడు — వార్తాహరుఁడు.

దుర్యోధనుఁడు

దుశ్శాసనుఁడు

శకుని

ఘటోత్కచుఁడు

## స్త్రీలు

గాంధారి

దుస్సల — దుర్యోధనుని చెల్లెలు, సైంధవుని భార్య

ప్రతీహారి — అంతఃపుర ద్వారపాలిక

# దూతఘటోత్కచము

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించును)

భావుక దేవసంతతి నుపాయశతంబులఁ బ్రోచు ప్రోడ, నా
నావిధరూపభాసి, భువనత్రయనాటకతంత్రవస్తు ప్ర
స్తావన తత్సమాపన విధాన విచక్షణ సూత్రధారి, శ్రీ
దేవకినందనుండు శుభదృష్టిఁ గృతార్థత మీకొసంగుతన్. 1

(ముందరికి నడచి) సభవారికి నా విన్నపము. (వినుట నభినయించి) ఏమి ఆ శబ్దము?

(తెరలో)

తెల్పండయ్యా, తెల్పండి.

సూత్రధారుఁడు:— సరే. తెలిసినది. జనార్దన ధనంజయులు సంశప్తకులమీఁదికి పోయియుండఁగా, కౌరవులు భీష్మ వధక్రోధమునఁ జుట్టుముట్టి అభిమన్యుకుమారుని బడఁ గొట్టినారు.

గీ. అర్జునాత్మజవిశిఖక్షతాంగులైన
క్షితిపతులు పోవుచున్నారు శిబిరములకు,
ఫల్గునుఁడు వచ్చిపడు నన్న ప్రబలభీతి
నాతఁడుండెడు దిక్కునే యరసికొనుచు. 2

(నిష్క్రమించును)

ఇది స్థాపన

(భటుఁడు ప్రవేశించును)

భటుఁడు:— నూర్గురు కొడుకులుగల ఉత్తమకుటుంబీ, వినయాచారసంపన్నుఁడూ, విజ్ఞానవిస్తారితదీర్ఘదృష్టీ-అయిన మహారాజు ధృతరాష్ట్రునకు తెల్పండయ్యా, తెల్పండి.

ఉ. మాటలు క్రీడియాచుఁ, నభి
మన్యుకుమారుఁడు హెచ్చి హేలగా
వారణవాజియోధరథ
వర్గము వచ్చుచునుండ, నింతలో
శూరులు పల్వు రొక్క మొగిఁ
జొచ్చి, నలుంగడఁ గమ్మి క్రమ్మి యా
దారకుఁ జేర్చి రాతని పి
తామహుఁడో సురనాథు నంకముఁ. 3

(ధృతరాష్ట్రుఁడు, గాంధారి, దుస్సల, ప్రతీహారి ప్రవేశింతురు)

ధృత:— ఎవడురా వాఁడు?

సీ. ప్రియము నా కౌనటంచు విప్రియముఁ బలికి
వీనుదోయికిఁ బీడ గావించినాఁడు;
మాకు శిశువధపాపపు మచ్చఁ గూర్చి
చాటుచున్నాఁ డభీతి వంశక్షయంబు. 4

గాంధారి:— మహారాజా! ఈ కులకలహము మన కుమారుల నందఱిని అంత మొందించిగాని శాంతింపన ట్లున్నది.

ధృత:— శాంతించును; శాంతించును.

గాంధారి:— ఎప్పుడు మహారాజా?

ధృత:— ఎప్పుడా?

మ. హరి పగ్గంబులుఁ జేరుకోలఁగొని ది
వ్యస్యందనంబుద్ధతిం
బఱపన్, గాండివమూనిపార్థుఁడు సుత
వ్యాపాదసంజాత ని
ర్భరరోషంబునఁ గాలరుద్రుఁడయి వి
ధ్వంసంబు గావించుఁ బె
ల్కుఱ లోకంబుసమస్త; మాపయిని గ
ల్గున్ శాంతి లోకానికిన్. 5

గాంధారి:— అయ్యో! అభిమన్యూ! ఉత్తమపురుషుల నందర్నీ ఊడ్చివేస్తున్న యీ పాడుకయ్యంలో నీ వెందు కడుగు బెట్టావోయి? ఆటగాయతనంగా ఆలమున కురికి, మమ్మిట్లు దుఃఖముపాల్చేసి, యెటుపోతివిరా తండ్రీ!

దుస్సల:— ఇట్లుత్తరకు వైధవ్యం గలిగించినవాడు, తన భార్యకును వైధవ్యం విధించుకొన్నవాడే.

ధృత:— ఈ వ్యసనమహార్ణవమునకు ఇటు దారిపెట్టినవాఁడెవఁడు?

భటుఁడు:— (ప్రవేశించి) నేను - మహారాజా!

ధృత:— ఎవఁడవురా, నీవు?

భటుఁడు:— నేను జయత్రాతుఁడను గదూ? మహారాజా!

ధృత:— ఓహో! నీవా? జయద్రథా! బ్రతుకు భారమై, పాండవపంచాగ్నుల కింధనము కాఁగోరి, అభిమన్యుని వధించిన ఆ నిర్భాగ్యుఁ డెవఁడురా?

భటుఁడు:— ఒకఁడుగాడు, ప్రభూ! రాజులు చాలామంది చేరి, అబ్బాయిగారిని అంత మొందించినారు. అందు నిమిత్తభూతుడు జయద్రథుడు.

ధృత:— (అదిరిపడి) ఏమీ? జయద్రథుఁడా? వాఁడా నిమిత్త భూతుఁడు?

భటుఁడు:— మరె; మహారాజా!

ధృత:— అయ్యో! అతఁడు హతుఁడే.

దుస్సల:— (ఆ మాట విని యేడ్చును)

ధృత:— ఎవరా యేడ్చునది?

ప్రతీహారి:— అమ్మాయి, దుస్సల; మహారాజా!

ధృత:— ఏడువకమ్మా, ఏడువకు. మీ ఆయనకు నీ వైదువతన మిష్టము లేదు. అందువల్లనే, కావలెనని గాండీవి బాణాలకు గుఱియై కూర్చున్నాఁడు.

దుస్సల:— ఇక నే నిక్కడ యెందుకు నాయనా! నాకు సెలవిస్తే, అమ్మాయి ఉత్తర దగ్గరకే పోతాను.

ధృత:— పోయి?

దుస్సల:— పోయి, 'నీ యీ వేషమే నేనూ ధరించబోతున్నా'నని చెపుతాను.

గాంధారి:— ఛీఛీ! అమంగళము; అట్లనగూడదమ్మా! నీ భర్త బ్రతికేయున్నాడుగా?

దుస్సల:— అమ్మా! అట్టి యదృష్టము నా కెంకెక్కడిదే? జనార్దనసహాయుడైన ధనంజయునికి అపకారముచేసి జీవింపగలవా డెవడే?

ధృత:— అవును తల్లీ! ఆమాట నిజము.

మ. తన మృదులోష్ఠబాహు లుప
ధానములై తగ శౌరి యంకమం
దనయముఁబెంప, సీరి సుర
కంటెఁ బ్రియంబుగ గారవింప, శౌ
ర్యనిధులు పాండవుల్ సతముఁ
బ్రాణముగా నరయంగఁ బ్రోదిగాం
చిన పసివానిఁ జంపె; నిఁక
జీవముతో నతఁ డుండఁగల్గునే? ౬

జయత్రాతా! కుమారుని ఆస్థితిచూచి గాండీవధన్వి ఊరకున్నాఁడా?

భటుఁడు:— అది ఆయనయెదుట జరిగిందా? మహారాజా!

ధృత:— ఎట్లూ? ఆ సమయమున అర్జునుఁ డక్కడ లేఁడా?

భటుఁడు:— చిత్తము దేవరా!

ధృత:— అది యెట్లు జరిగినదిరా?

భటుఁడు:— చిత్తగించండి మహారాజా! కృష్ణార్జును లిద్దరూ దూరానున్న సంశప్తకులమీదికి పోయున్నారు. ఆ

సమయంలో అభిమన్యుకుమారుడు పసితనంవల్లబరవసంగా బవరములో జొరబడ్డాడు. అంతే దేవర!

ధృత:— అట్లైన నాతనివధ కనుకొనవలసినది లేదు. అర్జునుఁడు లేనందువల్ల అది సంభవించినది. పులియున్న గుహాకడ కెవఁడు రాఁగలఁడు? సరే; మఱి తక్కినపాండవులు?

భటుఁడు:— జయద్రథుఁడు దారి నడ్డగించినాడట! అందువల్ల వారక్కడికి రాలేరు; ప్రభూ!

ధృత:— అయ్యో! హతవిధీ! ఆ దౌర్భాగ్యుఁడు కుమారుని మృతికి ఆవిధముగా కారణమైనాఁడా? భీమాదులు పిమ్మటనైనా వచ్చిరా?

భటుఁడు:— వచ్చినారు ప్రభూ! అర్జునుఁడు వచ్చి చూడవలెనని అగ్నిసంస్కారమాపి, ఇప్పుడు, అబ్బాయిని అంబులతో గొట్టిన రాజులపేరులు గుర్తిస్తున్నారు.

ధృత:— (నిట్టూర్పు విడిచి) గాంధారీ! లే; గంగకుపోదము.

గాంధారి:— స్నానానికా మహారాజా?

ధృత:— కాదు, కాదు.

గీ. మరలుపంజాల సమరోద్యమంబునుండి
నీ కుమారుల నేను; గాండీవిచేత
వారలెట్లును హతులె; యవ్వారికిపుడె
వదలివచ్చెద నందు నివాపజలము. 7

(దుర్యోధనుఁడు, దుశ్శాసనుఁడు, శకుని ప్రవేశింతురు)

దుర్యో:— తమ్ముఁడా, దుశ్శాసనా!

చ. బలపడియెన్ విరోధము సు
భద్రసుతుండు హతుండు కావుటన్;
వలవలయేడ్చుచేఁ బ్రతి
పక్షగణంబు; మదం బడంగి పై
పోలఁగె నిరాశఁ గేశవుఁడు;
కొంటినెగుల్ తెగిపోయెనా; కహో
వలచె జయంబుతోడ నను
భాస్వరకీర్తియు రాజ్యలక్ష్మియున్. 8

దుశ్శా:— ఆహా. సందేహమేమి?

మ. అతులానీకమునంపి సైంధవుఁడు పా
ర్థాఘ్వంబునడ్డన్ శర
ప్రతతిన్ ముంచి కలంచి నొంచి యల సౌ
భద్రున్ ద్వితీయార్జునున్
హతుఁ గావించితి; మాపగాత్మజవధ
ప్రాప్తవ్యథల్ తీఱెపోన్
సుతశోకంబున నింపినా మరిమన
స్సుల్; క్రుస్సి కూలారఁగన్. 9

శకుని:— ఈనాఁడు సైంధవుఁడు సంగ్రామరంగమునఁ గావించిన ఘనకార్యము, ఇతర నృపతు లూహింపనైనను అలవికానిది. ఒక్కదెబ్బతో, కుమారునితో పాటు వాండ్ల యశస్సునుగూడా హరించినాఁడు.

దుర్యో:— మామా! తమ్ముఁడా! రండి నాయనగారికి నమస్కరించి వత్తాము.

శకుని:— వత్సా, దుర్యోధనా! వలదు వలదు.

సీ. అతఁ డెద కోఁతగించు నీ జ్ఞాతికలహం;
మెంచుఁ బాండవహితము, గర్హించు మనల
సంగరంబున సంపూర్ణజయముగాంచి
గాని పోనొప్ప డాతనికడకు మనము. 10

దుర్యో:— అట్లుకాదు మామా! ఏమైననుసరే మనము వెళ్లి నమస్కరించిరావలసినదే.

శకుని:— అయితే సరే. (ముగ్గురును వెళ్లుదురు)

ధృతరాష్ట్రుని భవనము

(శకుని దుర్యోధన దుశ్శాసనులు ప్రవేశింతురు)

ధృత:— ఎవరు?

దుర్యో:— జనకా! నేను దుర్యోధనుఁడను. అభివాదనము.

దుశ్శా:— తండ్రీ! నేను దుశ్శాసనుఁడను. అభివాదనము.

శకుని:— నేను శకునిని. అభివాదనము.

ధృత:— (పలుకకుండును)

ముగ్గురును:— ఆశీర్వదింపలేదే!

ధృత:— ఏమీ? ఆశీర్వాదమా?

గీ. కృష్ణునకుఁ బార్థునకుఁ గూడ హృదయమైన
బాలు వధియించితిరి మీరు బ్రతుకుమీఁది
యాసపోనాడి; అట్టి మీ కాత్మనెట్టి
శ్రేయమాసింతు? నేమ నాశీర్వదింతు? 11

దుర్యో:— తండ్రీ! నీ యీ వ్యాకులతకు కారణమేమి?

ధృత:— వ్యాకులతకు కారణమేమని నన్నడుగుచున్నావా?

గీ. బహుసుతసనాథమైన యీ వంశమందు
కలిగెఁ బుత్రవిశిష్ట యొక్కతియె పుత్రి
ఆను మాంగల్యమునకె ముప్పావహిల్లెఁ
గాఁట! బాంధవులైన మీ కరుణవలన. 12

దుర్యో:— ఇందులో జయద్రథున కేమి సంబంధమయ్యా?

ధృత.— ఆ పరవిదగ్ధుఁడేగదా పాండవుల నడ్డగించినవాఁడు?

దుర్యో:— అవును - అడ్డగించినాఁడు; కాని, అతఁడొకఁడే
యేమి? ఇంకను పలువురున్నారుగదా!

ధృత:— పలువురా! ఓరి పాపిష్ఠులారా!

గీ. నిర్దయతఁ బల్వురేకమై నిసువునొకనిఁ
జిత్రహింస యొనర్చిరే సిగ్గులేక!
బాలకుని నొంచు పాపుల బాహులట్టె
ముక్కలై చెక్కలై కూలిపోవలేదె? 13

దుర్యో:— తండ్రీ!

గీ. వృద్ధుఁడగు భీష్ము వంచించి విఱుగఁబొడుచు
కూళల భుజాలు ముక్కలై కూలెనొక్కొ?
పోటుబంటైన యూతనిఁ బోరఁ గూల్చు
భూపుల భుజాలు ముక్కలై పోవ నేల? 14

ధృత:— కొడుకా! అభిమన్యుని వధించుటయు భీష్మునిఁ గూల్చుటయు నొకటేనా?

దుర్యో:— ఒకటి కాక యేమి?

ధృత:— అదెట్లగునోయి? భీష్ముని కథయే వేఱు.

గీ. తనవశము చావు; కూల్ప నతండె కీలు
తెలిపి కూలెను, హర్షంబు నొలసె.— బాలుఁ
డితఁడు, వంశాకురంబు, పొట్టతొలి మొగ్గ
పార్థభూజమ్మునకు; త్రుంపఁబడియె నకట! 15

దుశ్శా:— తండ్రీ! ఆ బాలుఁడు బాలుఁడు కాఁడు. అతఁడు — (అనుచుండఁగనే)

ధృత:— ఎవరా మాటలాడునది? దుశ్శాసనుఁడేనా?

దుశ్శా:— అవును నాయనా.

ధృత:— ఏమోయి — అభిమన్యుఁడు బాలుఁడు కాఁడా?

దుశ్శా:— కాఁడు నాయనా. అతఁడు — ఆ హోరాహోరి పోరిలోఁ జొరఁబడి,—

గీ. కేరి, సాదన వేఁడియెక్కిన ధనుస్సు
నందఱముఁ జూచుచుండఁ గైనంది, తీవ్ర
కిరణకిరణోగ్రశరపరంపరలు గుప్పి
సకలనృపగాత్రములు గవాక్షములు చేసె. 16

ధృత:— ఓహో! అట్లనా! (నిట్టూర్పు విడిచి) హా! కష్ట కాలము. కుమారులారా!

క. ఒక బాలునిచేతనె మీ
రకటా! ఆ రీతి నోగిలి యదవదలైనా
రిఁకఁ బుత్రవ్యసనమహో
గ్ర కపిధ్వజుచేత నేమి గానున్నారో? 17

దుర్యో:— వాఁడేమి చేయును?

ధృత:— ఏమి చేయునో ఆయుశ్శేష మున్నచో మీరే చూచెదరు.

దుర్యో:— అబ్బో! అతఁ డంతటి మహావీరుఁడా!

ధృత:— నీ వెఱుఁగవా?

దుర్యో:— ఎఱుఁగనే!

ధృత:— అట్లైన నేనును ఎఱుఁగను. అతని వీర్యాతిశయము నెఱిఁగినవా రెంతోమంది యున్నారు. అడిగి తెలుసుకో.

దుర్యో:— ఎవరి నడుగుమనెదవు?

ధృత:— ఎవరినా?

మ. అడుగన్ వచ్చు [1]హరిన్ నివాతకవచ
ప్రాణోపహారార్చితున్
అడుగన్ వచ్చుఁ గిరాతవేషు హరు నా
నాస్త్రికసంతర్పితున్
అడుగన్ వచ్చుఁ గృశాను ఖాండవవన
వ్యాళాహుతి ప్రీణితున్
అడుగన్ వచ్చును నాఁడు నిన్నొడిచెనే,
ఆ [2]చిత్రసేనాభిధున్. 18

దుర్యో:— సరే. అతఁడు పరాక్రమశాలియే యగుఁగాక. అతనికిఁ జాలినవారు నాపక్షమునమాత్రము లేరా యేమి?

ధృత:— ఎవరు వారు?

దుర్యో:— కర్ణుఁడే.

ధృత:— ఓరీ! వాఁడట్రా? నవ్వులచేటు. కర్ణుఁడా కవ్వడికెదురు?

దుర్యో:— ఏల కాఁడు?

ధృత:— ఏల కాఁడా?

మ. అతఁడో అర్ధరథుండు, దేశికరుషా
వ్యర్థాస్త్రశస్త్రుండు, స్వః

---

1 హరిన్ = ఇంద్రుని.

2 "విద్యారక్షిత మద్య యేన చ జిత స్త్వం పృచ్ఛ చిత్రాంగదమ్" అని మూలము.— ఘోషయాత్రలో దుర్యోధనుని బంధించినవాఁడు 'చిత్రసేనుఁడు' గాని, 'చిత్రాంగదుఁడు' కాఁడు.

పతికాపత్యహృతాత్మనర్ముఁడు, మృదు
స్వాంతుండు, భ్రాంతుండు, పాం
డుతనూజప్రతిమానుఁడౌనె? గిరిశుం
డున్ వహ్నియున్ వజ్రియున్
తతదివ్యాస్త్రము లిత్తురేని యతఁ డం
దన్ నచ్చుఁ దత్సామ్యమున్. 19

శకుని:— మీరు పెద్దలు. మమ్మెంతగానైనను కించపఱచ వచ్చును లెండి.

ధృత:— ఆ మాయావుఁడతఁడు శకునియేనా?

శకుని:— అవును; నేనే.

ధృత:— ఓరి - జూదరీ! నీవు మాకులమున కంటించిన కలహాగ్ని మా వంశాంకురములనైనను విడువక దహించుచున్నది గదరా!

దుర్యో:— ఎక్కడిది యీ మహాధ్వని? అరె; ఏమిది?

క. పుడమి వడఁకాడుచున్నది,
పడుచున్నవి యుల్కములు, నభంబంతయు మం
డెడుపగిదిఁ దోఁచె, నిపుడీ
వడువున నొడుగొడుకు లేరుపడఁ గతమేమో? 20

ధృత:—

క. తన మనుమని దుర్మరణముఁ
గని కుములుమహేంద్రుఁ డస్రకణజాలం బీ

యనువున నుల్కారూపం
బున రాలుచునున్నదనుచు బుద్ధిఁదలంతుర్. 21

దుర్యో:— జయత్రాతా! శంఖ పటహ సింహనాదములతోఁ గూడిన యీ మహాశబ్దము పాండవశిబిరమునఁ బుట్టినట్లున్నది. నిమిత్తమేమో తెలిసికొనిరా.

భటుఁడు:— దేవర ఆజ్ఞ. (అని వెళ్లి, మరలవచ్చి) మహారాజునకు జయము. సంశప్తకసంఘముమీదికిపోయిన సవ్యసాచి తిరిగివచ్చి, మృతుడైన కొడుకును తొడలపై బెట్టుకొని, ఆతని శిరమును కన్నీటితో దడుపుచూ జనార్దనప్రేరితుడై ప్రతిజ్ఞ చేసినాఁడట.

దుర్యో:— చేయుఁగాక. తరువాత?

భటుఁడు:— ఆ ప్రతిజ్ఞకు రాజు లందరూ హర్షించి, ఉత్సాహమున పొంగిపోయి, జయజయశబ్దాలతో సింహనాదాలు చేయగా వెంటనే శంఖపటహభేరీకాహళాదులు మోగింపబడినవట. ఆ పెనుమోతకును, పెనుగొండల వంటి ఆ రాచవారి పరవళ్లకును – ఉరవళ్లకును భూమి దద్దరిల్లి, అలజడిపొందిన అబలవలె వడవడవణకింది.

ధృత:— ప్రతిజ్ఞా ప్రభావానికే భూమి వణఁకినది. మఱి యతఁడు ధనువుపై చేయివేసిన మూఁడులోకాలును అల్లాడవా?

దుర్యో:— ఇంతకును అతని ప్రతిజ్ఞ యేమని యఁట?

భటుడు:— "నా కుమారుని గూల్చినవానినీ, నా కొడుకు చావుకు సంతోషించినవాండ్లనూ రేపు ప్రొద్దుకూకేలోపల హతమార్చెదను" అని యట.

దుర్యో:— ప్రతిజ్ఞ నెగ్గకపోతే ప్రాయశ్చిత్తము?

భటుడు:— గాండీవముతో తాను చితి నెక్కునట.

దుర్యో:— మామా! చితారోహణము; చితారోహణము. తమ్ముడా! చితారోహణము; చితారోహణము. రండి, రండి. మన మాతని ప్రతిజ్ఞా వ్యాఘాతమునకు ప్రయత్నింతాము.

ధృత:— దుర్యోధనా! ఏమి చేసెదవు?

దుర్యో:—

మ. ఒరుకంటన్ బడకుండ దాతు సకలా
క్షౌహిణ్యుపేతస్థలిన్;
విరచింతున్ గురుబుద్ధి వైరిబలదు
ర్భేద్యంబున్వ్యూహంబు; వ్య
ర్థరుషన్ గ్రుంగి హతాశుడై విమతులం
తన్ వహ్నికుండంబుఁ జొ
త్తురు హస్త్యశ్వశతాంగయోధవరసం
దోహంబుతో నందఱున్. 22

ధృత:— వెఱ్ఱివాడా! సైంధవుని దాఁచెదవా?

గీ. కృష్ణలోచనములు సుమా, జిష్ణు సాయ
కములు; మింటికి నెగసినఁ, గడలి మున్గి

నను, రసాతలసీమ డాఁగినను విడువ
వరసి వెన్నాడి యవ్వాని శిరముఁద్రుంచు. 23

భటుఁడు:— ఈ మాట సహింపరానిది. నిర్దయుడును, చండశాసనుడును నైన మా ప్రభువుముందర, ఇంకొక డెవడైనా యిట్లా నోరుజారివుంటే వానితల యిప్పటికే యెగిరిపోయుండేదే.

(ఆకాశమున *ఘటోత్కచుని ప్రవేశము)

ఘటో:— (తనలో)

గీ. సోదరవినాశ శోక ప్రచోదితుండఁ
జనుచున్నాఁడఁ జక్రి శాసనము నెంచి,

---

* "ఘటో హా స్యోత్కచ ఇతి మాతా తం ప్రత్యభాషత
అభవ త్తేన నా మాస్య ఘటోత్కచ ఇతి స్మహ" (ఆది. 155-38)
అన్న శ్లోకముక్రింద, నీలకంఠవ్యాఖ్య, ఘటోత్కచశబ్దమున కిట్లర్థము చెప్పినది.

"వికచః కేశహీనః ఘట సాదృశ్యాత్. ఘట శబ్దే నాత్ర శిరః ప్రతీయతే. ఉత్కచః కేశహీనః. హేతొ త్వాశ్చర్యే. వికేశ స్థూలశిర స్కత్వా దస్య ఘటోత్కచ ఇతి నామాబ్రవీ దిత్యర్థః".

ఉత్కచ శబ్దమునకు, నిక్కపొడుచుకొనియుండు కచముగలవాడని యర్థమగునుగాని, 'వికచు' డని యర్థము కాదు.

ఘటోత్కచుడు, ద్రోణపర్వమున 'ఊర్ధ్వకేశుడు'గానే వర్ణితుఁడైనాడు.

"ఊర్ధ్వకేశం విరూపాక్షం దీప్తాస్యం నిమ్నితోదరమ్" (157-65)

మహాకవి భాసుఁడు, మధ్యమవ్యాయోగములో,- ఘటోత్కచుని,- "తరుణరవికరప్రకీర్ణకేశః" అనియే వర్ణించియున్నాడు.

కాబట్టి, 'వికచు' డన్న యర్థము సరికాదు,

కుమతియగు వైరికడకు; నంకుశపుంబోటు
నెంచి యాలానమును జేరు నిభముమాడ్కి. 24

(క్రిందికిం జూచి) ఇదే అతని హజారపు వాకిలి. క్రిందికి దిగెదను. (దిగి), నన్ను నేనే తెలుపుకొనెదను. (ప్రకాశము)

గీ. కేశవప్రేషితుండ, సందేశహరుండ
తనదు దుశ్చరితమున శాత్రవముగొన్న
తండ్రిం గనవచ్చి యున్నాండ ద్వారసీమ,
సగౌర్జితహిడింబసుతుండ – ఘటోత్కచుండ. 25

దుర్యో:—

గీ. రమ్ము రమ్ము కుమార! అరాతిభవన
మిదియె; దుర్యోధనుండ నేనే; జనార్ద
నోక్తియన్నంతంగాతుక ముప్పతిల్లె,
వక్కణింపుము వెస నరవాయిగొనక. 26

ఘటో:— (ప్రవేశించి, చూచి, తనలో) ఓహో! ఇతండు పూజ్యుండు ధృతరాష్ట్రుండు. అనార్యశతజనకుండు.— ఏమి యీ లలిత గంభీరాకృతివిశేషము.— ఆశ్చర్య మాశ్చర్యము. ఇంత వృద్ధుండైనను,—

గీ. ముదుత లంతగా నింత కేర్పడవు మేన;
స్కంధముల బిగి సుంతైన సడలలేదు;
నూర్గురు కొమాళ్లకును ధృతి నూలుకొల్ప
నాకృతింగొన్న శ్రద్ధనా నడరునితండు. 27

కన్ను లున్నచో ఈ బల్లిదుఁడు త్రిదివమున కెప్పు డెట్టి ముప్పు తెచ్చునో యన్న శంక చేత దేవత లితని నిట్లు సృజించిరి కాఁబోలు. (సమీపించి, ప్రకాశముగ) పితామహా! అభివాదనము. ఘటోత్కచు - (అను అర్ధోక్తిలో) కాదు కాదు. ముందు నా తండ్రులు యుధిష్ఠిరాదు లభివాదనము చేయుచున్నారు. పిమ్మట ఘటోత్కచుఁడను నేను చేయుచున్నాను.

ధృత:— రావోయి కుమారా! నీ యభివాదాచరణములోని తెలిఁబాటు సోదరమరణమున నీకుఁ గలిగిన మనోవ్యథను తెలుపుచూ నాకును దుఃఖము గలిగించుచున్నది. కుమారుల కుచేష్టలమూలమున నేను కృపణాస్థకు గుఱియైనాను.

ఘటో:— మీరు పూజ్యులు. కల్యాణనిధానమైన పితామహులకు చక్రాయుధుని సందేశము.

ధృత:— (ఆసనమునుండి లేచి) భగవానుఁడు చక్రాయుధుఁ డేమి యాజ్ఞాపించినాఁడు?

ఘటో:— వద్దు-వద్దు-లేవవద్దు. కూర్చుండియే వినవచ్చును.

ధృత:— చక్రాయుధుని యాజ్ఞ (అని కూర్చుండును)

ఘటో:— తాతా! వినుము. "అర్జునుఁడు, 'హా! కుమారా, అభిమన్యూ! హా! వత్సా, కురువంశప్రదీపా! తండ్రీ! యదుకులప్రవాళా! నీ తల్లిని, మేనమామను, నన్నును వదలి పితామహుని దర్శింప స్వర్గమునకు పోతివా' అని వాపోవుచున్నాఁడు. ఒక్కకొడుకును కోలుపోయిన అర్జు

ముని యవస్థ యిట్లైనదిగదా! ఇఁక నీయవస్థ యెట్లుండునో! కాఁబట్టి, పుత్రశోకమహాగ్ని నీ ప్రాణముల నాహుతిగొనకుండ మనసును భద్రపఱుచుకొనుము'' అని చక్రాయుధుని సందేశము.

ధృత:— చక్రాయుధుని క్రోధఘూర్ణితహృదయమునుండి వెలువడినవి యీ సందేశవాక్యములు. గాంచితి, సర్వక్షత్రసంహారమునకు సమకట్టియున్నాఁడని యీ సందేశము స్పష్టముగా తెలుపుచున్నది.

అందఱును:— ఈ ప్రసంగము హాస్యాస్పదము.

ఘటో:— ఏమీ? హాస్యాస్పదమా?

దుర్యో:— ఔను; హాస్యాస్పదమే. అర్జునుఁ డొక్కఁడే అఖిలక్షత్రవధము చేయు నన్న, విన్నవారు నవ్వరా? ఆతనిచే నా పని చేయింపనగునని చలపట్టి, ఆ కృష్ణుఁడు దేవతలతో గుసగుసలు జరుపుచున్నాఁడు కాఁబోలు!

ఘటో:— కురురాజా!

గీ. పంపినాతఁడు శ్రీ చక్రపాణి; వార్త
చెప్పవాఁడను నేను; వచించినదియొ
పార్థు శౌర్యంబు; నీవేమొ పరిహసించు
చున్నవాఁడవు.— ఇది నీకె యుక్తమగును. 28

సరే. దానికేమి. ఇఁక జనార్దనుని సందేశము వినండి.

దుశ్శా:— పనికిరాదు. ఓరీ, క్షత్రియాపమానీ! ఆ మాట యెత్తకుము. లోకములోని రాజులెల్లరును ఏ మహా

రాజుశాసనమును శిరసావహింతురో ఆ మహారాజునకు, రాజుకానివాఁ డెవఁడో సందేశము నంపుటయు, దాని నిక్కడ వినిపించుటయునా? ఇక్కడ నీ సందేశము నాలించువారు లేరు; పొమ్ము.

ఘటో:— అరే! దుశ్శాసనా! ఏమంటివి? చక్రాయుధుడు రాజు కాఁడా నీకు?

మ. మనుజేంద్రుల్ మును ముక్తులై రెవనిచే
మానంబు లూనంబుగా;
ఘను లగ్గింపఁగ భీష్ముచేఁ గొనియె న
ర్ఘ్యంబే మహాత్ముండు; శ్రీ
వనితారత్నము కోరి యేవిభు నురో
భాగంబునన్ నిల్చె; నా
యనఘుం, డాహరి, ఆప్రభుప్రభుఁడు కాఁ
డా రాజు నీకుద్ధతా! 29

దుర్యో:— దుశ్శాసనా! వివాదమెందుకు? నీవూరకుండుము. ఓయి దూతా! అతఁడు రాజు కానీ, కాకపోనీ; అతఁడు బలవంతుఁడు కానీ, కాకపోనీ; మాటలతో పనేమి? మీ ప్రభు వేమన్నాఁడు?

ఘటో:— అట్లా దారికిరా. చక్రాయుధుఁడు ప్రభువే. మూఁడు లోకాలకూ ప్రభువు. విశేషించి మాకు ప్రభువు.

గీ. "అనుకొనుము క్షత్రియవినాశ మైనయట్లు;
తీఱిపోవునుగాక భూభారమింక;

సుతవన్నోద్రిక్త పార్థ నిష్ఠురనిశాత
బాణకీలల కని నష్టపాటు లేదు". 30

అని మా ప్రభువు సందేశము.

శకుని:— (పరిహాసముగా) ఔనౌను; మాటలతోనే సర్వశత్రుసంహారము; మాటలతోనే పరరాజ్యసమాకర్షణము.

ఘటో:— ఓహో! శకునిగారా! ఓయి శకునీ! నీకొక మంచి మాట చెప్పెదను విను.

గీ. పాచికలు మాని, నీ నెత్తపలక నవికి
నొనర శరయోగ్య మొనరించుకొనుము; కలన
దారహరణంబు, రాజ్యతంత్రమును లేవు
ప్రాణమె పణంబు; కేళి శస్త్రాళితోన. 31

దుర్యో:— ఓహో! వీఁడు తనబుద్ధి బయటఁబెట్టినాఁడు.— ఏమిరా! చేతులు బారలువేయుచూ అంతగా నోరుపాఱ వేసికొనెదవు? నీ మర్యాదమాలిన ప్రసంగ మంతటితో ఆపు.

గీ. మాతృపక్షోగ్రరూపదర్పాతిశయముఁ
బట్టి కాఁబోలు నంతగా మిట్టిపడెదు;
వీసమైనను నీ కేమి తీసిపోము
రాక్షసోగ్రస్వభావదర్పములయందు. 32

ఘటో:— నిజమే. రాక్షసులు మీయంత క్రూరులుగారు.

శా. భ్రాతల్ నిద్దురవోవఁజూచి యిలు కా
ల్పంబోరు రాత్రించరుల్

భ్రాతృస్త్రీకురు లంటఁబట్టి సభనీ
డ్వంబోరు రాత్రించరుల్
భ్రాత్రీయుం బసివాని నాజి వధియిం
పంబోరు రాత్రించరుల్
భీతింగొల్పు కురూపులయ్యును కృపక్
వీక్షోరు రాత్రించరుల్. 33

దుర్యో:— ఓరి వాచాలా!

ఆ. వె. తోడరివచ్చి తీవు దూతగా నిచటికి
మముఁ గెరల్చు పోటుమాట లేల?
చక్క వెడలిపొమ్ము సందేశముం గొని
కాము మేము దూతఘాతకులము. 34

ఘటో:— (రోషముతో) ఏమీ! 'దూత' యని తూలనాడె
దవా? కానిమ్ము; నేనిక దూతనుగాను; మీపాలిటి
యమదూతను.

ఆ. వె. అల్లెత్రాడు దెగిన యభిమన్యుఁడను గాను
యుద్ధమునకె యిదిగో సిద్ధపడితి;
శూరులెల్ల రొకటివై రండు హైడింబుఁ
డుఱక మిమ్ము విడిచి యరుగఁ డింక. 35

నా పసితనపు టుబలాటము మీ బంటుతనమును పట్టి
చూడ నురకలు వేయుచున్నది. (జౌడు గఱచి, పిడికిలి
చూపుచు)

ఆ. వె. మార్కొనంగఁ దివురు మగవాఁ డెవఁడో లేచి
నిల్చుఁగాక, పొడిచి గెల్చుఁగాక;

పిడుగుఁబోని నాదు పిడికిటిప్రేటుతోఁ
గాలుద్రోలి కనినఁగాక యున్న. 36

(అందఱును యుద్ధమునకు సిద్ధమగుదురు)

ధృత:— పౌత్రా! ఘటోత్కచా! శాంతించు, శాంతించు. నా మాట విను నాయనా!

ఘటో:— (తనలో) తాతగారి వచనమువల్ల నేను మరల దూతనైతిని. కాని, రోషము నణచుకోలేకున్నాను. (ప్రకాశము) కురుపతీ! నీ విజ్ఞాపన మేమనీ?

దుర్యో:— ఆఁ! ఎవనికి విజ్ఞాపనము? మా వచనముగా నిట్లు చెప్పుము:

ఉ. "ప్రేలుట నోరిచేటు; బెద
గింపుల కింతయు జంక మేము; వా
చాల కువాచికంబున కొ
సంగము మాఱు; సమీకమైన భూ
పాలురు గొల్వఁగాఁ గదలి
వత్తుము; పార్థులఁ గొంచురమ్ము; మా
వాలికయంపపోట్ల ప్రతి
వాచిక మౌనని నీకు గోపకా!" 37

ఘటో:— సరే. పితామహా! వెళ్లుచున్నాను.

ధృత:— మంచిది. పోయిరా నాయనా!

ఘటో:— ఓహో! రాజులారా! జనార్దనుని సందేశమున
కడపటి వాక్యమిది. వినండి.

ఉ. చేయుఁడు ధర్మముల్; కనియఁ
జేయుఁడు బంధుజనంబు; యుష్మదా
ప్యాయనకాంక్షితంబులు స
మస్తము నిప్పుడె తీర్చుకొం; డిఁకే
చాయను ద్రోయరానిమృతి
*జాత్యనిదేశమనంగ మీకు వే
గై యరుదెంచుఁ బాండుతన
యాకృతి రేపు ప్రభాతవేళలన్. 38

భరతవాక్యము

పాపభీతియు, దైవభక్తియు, బాంధవప్రణయంబు, వృ
ద్ధోపసేవనతత్పరత్వ, మనుద్ధతప్రభవంబు, లో
కాపవాదసుదూరవృత్తము నారఁగల్గి జగజ్జనుల్
శ్రీపరాత్పరు హార్దవీక్షణచే సుఖింతురు గావుతన్. 39

(అందఱును నిష్క్రమింతురు)

దూతఘటోత్కచమను ఉత్సృష్టికాంకము సమాప్తము

* "జాత్యోపదేశ ఇవ వః కృతాంతః ఉపైష్యతి" అని మూలము.

"జాత్యోపదేశ ఇవ — as if it was the most noble or excellent counsel:— the idea is very abstruse; జాతౌ భవః జాత్యః. జాతి + య (త్)." అని దేవధర్ పండితుడు.